# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర ఫాల్గుణశు॥౧౫ సోమవారము


## ఆప్తవాక్యము

చాంగ్ కేషేఖుగారు హిందూస్థానములో రెండు వారములుండినదియు, నెహ్రూ, మహాత్మాగాంధీ, ఆజాద్ మున్నగు కాంగ్రెసునాయకులతోను, ఖాయిదేఆజం జిన్నాగారితోను, ప్రభుత్వాధికారులతోను వైస్రాయి బహద్దరుగారితోను, సంప్రతింపులు చేసినదియు, పాఠకులెరిగియున్నారు. వారు హిందూస్థానములో నుండగానే సింగపూరు పతనమయ్యెను. జగత్తులో అంతటి దృఢసంరక్షితమగు రేవు మరొకటిలేదని చెప్పుచుండిరి. హాంకాంగ్‌ను ౨౧ దినాలవరకు రక్షించిరి. కాని సింగపూరును వారము దినాలే రక్షించుకొగలిగిరి. షేఖుగారు హిందూస్థానములో ఉండగానే జపానువారు బర్మారోడ్డును సమీపించుచూవచ్చిరి. హిందూస్థానానికి సంపూర్ణముగా అపాయమేర్పడినది. ఇట్టిస్థితిలో షేఖుగారి అభిప్రాయములెట్టివో తెలుసుకొనవీలుకలిగినది. వారు వెళ్లుతూ గతవారము హిందూస్థానవాసులకును బ్రిటిషు ప్రభుత్వానికిని ఒకసందేశమిచ్చి పోయినారు.

హిందూస్థానమువారికి యుద్ధాశయములనుగురించి తెలిపినారు. జపానువారి లక్షణాలెట్టివో సూచించినారు. హిందూస్థానమునకు "నిజమైన రాజకీయాధికారమును" వెంటనే ఇచ్చివేయవలసినదని బ్రిటిషువారికి తెలిపినారు.

ఈయుద్ధము స్వాతంత్ర్యమునకును దాస్యమునకు, జ్యోతికిని తిమిరమునకును, సత్యమునకు అసత్యమునకును జరుగునట్టిపోరాటమని తెలిపినారు. అన్యాయాక్రమణము చేయునట్టివారు (అనగా జర్మనీ ఇటలీ జపాను అని వారియుద్దేశము) విజయమందినచో ప్రపంచమందు ౧౦౦ ఏండ్లవరకు నాగరికత ధ్వంసమగుననియు, మానవులకష్టాలకు అంతమేయుండదనియు తెలిపినారు. ఇదినిజమే. అందుచేతనే ౨౬ దేశాలు శక్తిత్రయాన్ని ప్రతిఘటించుటకై ఒప్పుదల చేసికొనియున్నవి. అయితే ఈ ౨౬ దేశాలలో నిజముగా శక్తివంతమైనవి రష్యా, బ్రిటన్, అమెరికా, కనడా, దేశాలుమాత్రమే. ఆస్ట్రేలియాకు ఆత్మరక్షణమే కష్టమైపోయినది. చీనాకు ఈఐదేండ్లనుండి చావుబ్రదుకుల సమస్యయైపోయియున్నది. తక్కినదేశాలలో ఇండియా పూర్వమునుండి దాస్యదేశము. దీనివిలువ యేమియు లేదు. ఇండియాకు ఆయుధసామగ్రిలేదు. జనులకు జీవితమే ఎక్కువై పోయినది. మలయాలో గుండుపడితే మద్రాసు ఖాళీకాజొచ్చెను. అసామువారు కత్తులు పారవేస్తే కలకత్తా తలక్రిందయ్యెను. నిరాయుధులుగాచేయబడి కత్తి మొగమైనా ఈ ౧౬౦ ఏండ్లనుండి చూడనిజాతి ఏమి చేయగలదు. ఒక లక్ష గొర్రెలు ఒక పులిని ఏమిచేయగలవు సాయుధులకు నిరాయుధులకు ఇంతేభేదము! హిందూస్థానములో ౪౦ కోట్లమంది కలరన్నలెక్కయేకాని ఈకోట్లకొలదిమంది యుద్ధములో ఏమిలెక్కకువత్తురు? అర్థికముగాచూచినది అతిదరిద్రదేశమైనది. పరిశ్రమలకు స్థానములేదు మనము మోటార్లనుసిద్ధముచేసుకో కూడనివారమైతిమి. మనకు నౌకాబలములేదు. ఇట్టిస్థితిలో ఇంతపెద్దదేశ మేమిచేయగలదు? అందుచేత మనలో చైతన్యము కలుగవలె నన్న మనకు

యుద్ధములో సజీవమగు ఆసక్తి యుండవలెనన్న ఇదినాదేశము. నాకుస్వాతంత్ర్యమున్నది. దాన్నిరక్షించుకొనుటనా ధర్మము. దానికై నాప్రాణాలను చిరునవ్వుతో అర్పించుకొంటాను. నాదేశముపై విదేశీయుల ఆక్రమణమును ఎన్నటికి కలుగనీయను. అనుభావనభారతీయులహృదయములలో తరంగములవలె చెలరేగవలెను. ఇకతక్కినదేశాలన్నియోఅవి హిట్లరుచేత పరాజితమైపోయి హిందూస్థానమువలెనే—ఇంకేమైనా అంటే అంతకంటెహీనముగా — ఉండిపోయినవి.

ఇట్టివాతావరణములో జపానువారి విజృంభణ మరింత భయానకహేతువైయున్నది. జపానువారు బౌద్ధులనియు వారుమంచివారేమో అనియు కొందరి భావన అయియుండవచ్చును. వారిలో బౌద్ధత్వము చాలాతక్కువ. వారిలోకరుణఅనేదిలేనేలేదు. వారు చీనాలో చేసిన ఘోరాలను చాంగ్‌కేషేఖువంటి ప్రామాణిక మహానాయకుడు ప్రకటించియున్నాడు. లక్షలకొలది చీనా ప్రజలను జపానువారు నరికివేసియుండిరనియు, ఇండ్లలూటీలు, స్త్రీలచెరచుటలు, చీమలచంపినట్లుగా పరాజితులను హతము చేయుటలు, ఇవన్నియు వారికి ఉగ్గుపాలతో నేర్పింపబడినవిద్యలు. అట్టివారు మనదేశముపైబడిన యెంతటిఘోరము జరుగునో ఊహించుకొనశక్యముకాదు.

షేఖుగారు ఇట్టిసందర్భములో జపానువారిని అరికట్టుటకొకే మార్గమును చూపినారు అదిహిందూస్థానమున్నూ చీనాయున్నూ కలసి ప్రతిఘటించుటయే. చీనాతనశక్తికొలది ప్రతిఘటించుచునేయున్నది. హిందూస్థానానికి స్వరాజ్యము వచ్చువరకు యుద్ధములోగాఢమగు ప్రయత్నము చేయుదని వారు గ్రహించి బ్రిటిషువారు వెంటనే హిందూస్థానానికి నిజమైన రాజకీయాధికారము ప్రసాదించవలెనని హితవుచెప్పిపోయినారు. దానిపై ఆచరించుకొనుటకో నిరాకరించుటకో సర్వాధికారము ఒక్క చర్చిల్ ప్రధానిగారికితప్ప ఇంకెవ్వారికినిలేదు. వారిభావములుమారితే ఇదిసంభవమగును. వారి దివసలో వలెనేముష్కరించుకొని యుండగూడదని పార్లమెంటుసభ్యులలో ముఖ్యులైనవారును ఇంగ్లాండులోని పత్రికలన్నియు ఏకఘాటిగా యీరెండుమాసములనుండిఆందోళనముచేయుచున్నారు. కాని చర్చిలు ప్రధానిగారికి మనసుకరగలేదు, అదెన్నడుకరుగునో ఎట్లుకరుగునో ఆదేవునికే యెఱుక!

---

ఈవర్వ్ని ౨౮వతేదిరాత్రి లోధవాడి ఉప్పరధూల్‌పేటలో నారాయణసింగు అను లోధాను ఇంటిముందే ఎవరోపొడిచిరి. అతడు మరణించెను- అక్కడనే పడియుండిన మరిముగ్గురికికూడ గాయములు కలిగించబడినవి-అంతటిహత్య చేసినవారలు పారిపోయిరి- ఇది తెలిసిపోలీసుఅధికారులు నేరముజరిగినచోటికిపోయి పరీక్షించిరి-కొరోనరు శవమును పరీక్షించినతర్వాత శవమును స్మశానమునకు గొనిపోయిరి-పోలీసుజవానలు,ఖుఫ్యాజవానులు వెంటనే నేరస్థులనిద్దరిని పట్టుకొనగలిగిరి.

... ...

ఆత్రాఫుబల్దాజిల్లా షర్కీ-తాలూకాలో ఉప్పల్‌గ్రామమందు కొందరు తప్పతాగి సైకిళ్లపై వచ్చుచు. ౨౨ ఏండ్ల స్త్రీనిపట్టుకొని బలాత్కారముచేయు మెంచిరి-అపుడు యూనివర్సిటీ రోడ్డుమ గ్గుర్గురువాంగాలలో వచ్చుచు, ఈగోలవిని స్త్రీని విడిపించుటకైపోగా ఒకడుకత్తితో గాయపరచెను-తర్వాత ఆస్త్రీని అంబరుపేట పోలీసుథానాకు వద్దకుతెచ్చిరి. నిందితులు పట్టుకొనబడిరి.

## స్థానికవార్తలు

హిందీప్రచారసభ తరఫునజరుగబడు "హిందీవిశారద" మరియుహిందీరత్న"పరీక్షలు సం॥ ౧౯౪౨ మేనెల ౧౪-౧౫తారీఖులలో జరుపబడును- పరీక్షకు వెళ్లదలచినవారి దరఖాస్తులు సం॥౧౯౪౨ మేనెల౧౫వతారీఖువరకు నాంపల్లి స్టేషన్‌రోడ్డునయున్న శీతల్‌మేన్షన్‌లో సభాకార్యాలయమునకు చేరవలెను-పై తెలియబరచిన తేదిదాటిన దరఖాస్తులు ఏవిధముగానుస్వీకరింపబడవు.పరీక్షకువెళ్లువారు దరఖాస్తు ఫారములను సాధ్యమైనంతత్వరితముగాసభాకార్యాలయమునుండి తీసుకొని వాటినిపూర్తిచేసి పరీక్ష ఫీజుతోపాటు కధయుక్తకార్యాలయమునకు పంపవలెను-విశేషమైనవివరములు గోయబారుసభాకార్యాలయమునుండి ౫౧౧౧.మొదలు ౫౯౧,వరకు సాయంత్రం ౫౬౪మొదలు ౫౭౪ వరకు తెలుసుకొనగలరు.

కాలిబండదర్వాజాపు మంత్రిగారగు శ్రీ రాజా మనోహర్ లాల్ కారలుగారు, తమస్వంతకార్యభారమువలన, మంత్రిపదవికి రాజీనామా నిచ్చిరి. ౨౬-౨-౪౨ఆదివారము అంతరంగసభవారి త్యాగపత్రమును అంగీకరించుచుతో స్వీకరించి వారిస్థానే శ్రీరాజా రామరావు గారిని మంత్రిగా ఎన్నుకొనిరి.

గవర్నమెంటు సారమ్ పోలీసు రేగింపు సమాజమందిరమునుండి బయలుదేరి కిషన్‌గంజ్ చేరగలదు-మంగళవారము ఉదయము ౧౦ గంటలకు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజా ప్రభుదయాల్ గారి కరకమలముల జండావందనము కాగలదు"

... ...

స-ఘు-న నిజాం ప్రభుత్వమునందు పెద్దఉద్యోగులజీతములను తగ్గించుటను ప్రభుత్వమువారు ఆమోదించినట్లు "సువెరక్కూర్, పత్రికలో ప్రకటింపబడినది.

... ...

ఆంధ్రవిశ్వవిద్యాలయముయుద్ధపరిస్థితుల వల్ల హైదరాబాదునగరానికి రాగోరగా ఇక్కడిప్రభుత్వమువారు ఒప్పుకొన్నారను సమాచారము విషయములో కలిమద్దీన్ అస్సారిగారొక అభిప్రాయప్రకటనచేసినారు. ఈయుద్ధసమయములో మనహైదరాబాదు విశ్వవిద్యాలయ స్థితి విషయమే ఆందోళనగాయున్నపుడు క్రొత్తవిశ్వవిద్యాలయము నిక్కడికిరప్పించుఏర్పాట్లు చేయుగలభారమునమ పెట్టుకొనజాలమనియు, నాగపురమువంటిచోటులమునే ఏదేనిస్థలమునకు ఆవిశ్వవిద్యాలయముపోవుచో దానికి ఎక్కువగా తగినేఖర్చుమాత్రము సహాయము చేయవచ్చునే కాని అంతకంటెఎక్కువ చేయజాలమనియు వారుసూచించినారు.

... ...

హైదరాబాదు పురపౌరసంఘమువారు యుద్ధరక్షణసంఘము నేర్పాటుచేసిరి-అందులో అనుగురుసభ్యులుందురు, నాలంగారుకూడ ఉందవచ్చును

... ...

పాతవారధిదగ్గర జాంసింగుదేవాలయపు ఉత్సవముసందర్భములో ముఖ్యమంత్రిగారును, రాజాబహదర్ వెంకటరామారెడ్డిగారును దయచేసియుండిరి- ఈదేవాలయమునకు కృష్ణస్వామిముదిరాజుగారు ముంతజంగా ఉన్నారు.

... ...

కొందరు సికింద్రాబాదులోను, చాంద్‌ఖానాపీధిలోను అటునిటు తిరుగుచుండగా అక్కడినివాసులు అనుమానముతో వారలను పెచ్చరించిరి-అందుపై కొద్దిగా జగడము ప్రారంభమగుచుండగా పోలీసువారలుచ్చి శాంతి కలిగొల్పిరి.

... ... ...

సికింద్రాబాదు న్యాయాధిపతియగు శ్రీ లేబుకో పాల్‌పిళ్ళెగారు అబ్దుల్‌కరీం అనునిందితుని మరణదండనవిధించినారు-ఇదివరలో సికింద్రాబాదులో కల్లుఅంగడివద్ద కరీమ్‌బీయనునామెను చాకుతోపొడిచిచంపినట్లు అతనిపై నేరముమోపబడియుండెను- ౧౯౪౧ ఆగస్టు తేదిన మాహా గంజ్ కల్లుఅంగడివద్ద కరీమ్‌బీ అనునామెను చంపినాడనుటకు సాక్ష్యము కలదు అబ్దుల్‌కరీం కరీమ్‌బీని తీసికొని పైనబడినపుడు జగడముచేసి చాకుతో పొడిచిచంపెనట.

... ... ...

నేపాల్‌దేశపు కొంగలగుంపునుండి అబ్దుల్లా, అబ్దుల్‌గఫూర్ అనువారలు వచ్చి కొన్నిమాసాలుబొంబాయిలోనివసించి, తర్వాత హైదరాబాదు నగరానికివచ్చి చెప్పల్‌బజారునందు వ్యాపారము పెట్టుకొనగా, పరదేశీయులు మకాము పెట్టుకొనిరని విచారణచేయు సందర్భములో పోలీసువారు వారల గృహములోనికిపోయి సోదాచేసిరి-వారలు దొంగనోట్లు తయారుచేయుచున్నట్లు చూచుటకు ముద్రలున్నగు కొన్నివస్తువులుదొరికినవి. జర్మీలు, రూపాయలుకూడ దొరికినవి-ఇదివరలో ఈదొంగలబాదతీసినవారలకు ౧౦౦౦ రూపాయలు బహుమతినిచ్చునట్లుప్రకటించియుండిరి. పోలీసువరిశోధన యింకను జరుగుచున్నది.

... ...

ఈ ౧౯౪౨ ఏప్రిల్ ౧౫,౧౬న తేదులలో పర్బణీజిల్లాలో శ్రీ హనుమంతరావుగారి అధ్యక్షతన ఆదిహిందువులమహాసభ జరుగగలదు ప్రారంభోత్సవమును శ్రీ వెంకటరావుగారు చేసెదరు

... ...

నారాయణగుడములోని ఆంధ్ర నగరమున ౩౦ వర్వణ్ని మంగళవారము నాడు హోలీపండర్భమున జండావందనము గాపెదరు

... ...

హిందూయువకుల మహాసభను మార్చి నెల మొదటివారములో జరుపదలచిరిగాని ప్రభుత్వమువారిఅనుజ్ఞ వర్వణ్ని ఈరవతేదివరకుకూడ లభించనందువల్ల ఏప్రిలునెలలో జరుపనిశ్చయించినారు. హిందూయువకులు హిందీవారము చేయుచున్నారని దూర్వా గాతెలిసినది.

... ... ...

బీదరుజిల్లాలో ౧౯౪౨ మార్చి ౧౯వతారీకున శ్రీవామన శ్రీధర నాయక్‌గారి అధ్యక్షతన మహారాష్ట్రమహాసభ జరుప నిశ్చయించబడినది-

... ... ...

హైదరాబాదుసంస్థాన హిందూప్రజామండలి కార్యదర్శియగు వి-రామచంద్రరావుగారు ఈసంస్థానహిందువులందరికి నిజకర్తవ్యమైనవిజ్ఞప్తినిచేసినారు. అందులోనిముఖ్యవిషయాలు క్రిందివిధముగనున్నవి:-

సింగపూరుపతనము, బర్మాలోయుద్ధము మున్నగునవిచూచి రాజులవిని ప్రజలు భయపడవలసిన అవసరములేదు భారతదేశములో గంభీరంగేన ఇపుడుండుటయేగాక, ప్రతిమాసములో ౫౦ వేలసేన తయారగుచున్నది. భారతదేశముపై శత్రువుదండెత్తివచ్చినచో హిందువులు తమగృహ, దేవాలయ, క్షేత్రాదులను రక్షించుకొనుటకై ఈసేనలోను, నౌకాదళములలోను విమానదళములలోను, యుద్ధసామగ్రి చేయుదళములలోను చేరవలెను. బ్రిటిషుప్రభుత్వమువారిచేతనో నిజాంప్రభుత్వమువారిచేతనో ఏర్పాటు చేయబడుచుండే నగరరక్షకదళములలోను, విమానముల బాధనుండి రక్షించేదళములలోను చేరవలెను. ఇట్టిస్వతంత్రదళములను స్థాపించుటకై అనుమతి కోరుచు హిందూప్రజామండలివారు నిజాంప్రభుత్వ ప్రధానమంత్రిగారికొక విజ్ఞప్తినిపంపుకొన్నారు. గ్రామాలలోనిప్రజలను వినియోగముచేసి వాటి సాముదాయకరక్షణకై దొరికినచో ప్రభుత్వసహాయముతోను, లేనిచో స్వతంత్రదళస్థాపనలతోను,ఏర్పాటుచేయవలెను. అందరును వ్యాయామముచేయవలెను కష్టముకలిగినతోడి హిందువులకు తోడ్పడవలెను. ఆత్మరక్షణకై శస్త్రములుంచుటకొనసగిన లైసెన్సులు శస్త్రములుంచుకొనవలెను. దుండగీండ్రు ఎవరిగ్రామాలలోగాని ఉన్నచో వారలపేర్లు మున్నగువివరములను హిందూప్రజా మండలివారిద్వారా ప్రభుత్వము వారికి తెలియజేయవలెను. ఇట్టిదుండగములవిశేషములను మరికొంత తెలుపవలెను, గ్రామాలలో బలాఢ్యులను అత్మీయరక్షణార్థమై ఒకరుగాని, కొందరు కలిసిగాని పోషించవలెను. ప్రభుత్వమువారు రక్షణ ప్రకటించువరకు ఎవరుగాని నగరమువిడి పోరాదు,

... ...

సయ్యద్ మహమ్మదుఅక్బాప్ బి-ఏ-ఎల్-ఎల్-బి (ఉస్మానియా) గారు ౧౯౪౧వ-లో లండను పట్టముపొందియుండిరి. వారిని హైదరాబాదు హైకోర్టుముంతజంపనిలో భాయదరచనందువల్ల వారుతమపట్టమును వాపసుచేసినారు- దానిని వాపసుతీసుకొనినట్లుఅధికారులుకూడ తెలిపినారు

... ...

పోయాఉగుడెములో ఒకహత్యజరిగినది, షంసాబాదు పోలీసుష్టేషన్‌హౌస్‌అధికారి సమయమునకుచ్చెను-తరువాత పోలీసుసర్కిల్‌ఇన్‌స్పెక్టరుగారువచ్చి పరిస్థితులను లెక్కచెట్టి, కొందరిని పట్టుకొనిరి-శవమును పరీక్షచేయించినఅనంతరము వారసులకు యిచ్చివేసిరి.

... ...

౨౬సర్వ్దినాదు ఉస్మానియావిద్యాపీఠములోని స్నాతకుల (గాడ్జుయేట్ల)కు పట్టప్రధానము కావింపబడినవి. ఎర్.సీ.పి. రామస్వామి అయ్యరుదివాన్ బహద్దరుదివానుగారు స్నాతకోపన్యాసముచదివిరి. ౫॥ మెహిదీ యార్జంగుబహద్దరు గారికిని డాక్టర్ రజియుద్దీన్ సిద్దిఖీ గారికినిగౌరవడాక్టరు బిరుదములను ప్రసాదించిరి.

... ... ...

ఖమ్మంమెట్టుశాఖవారు ఖమ్మంనుండి రెయిలాదుకుపోవురోడ్డునునిర్మించి బాగుచేయునిమిత్తము ౩౦వేల రూపాయలు అంగీకరించి యున్నారు. అయ్యారావుపేటరోడ్డును ౧౫వేల చిల్లర యిచ్చినారు- పాళ్యరురోడ్డుకిదీ ఏచేయుచున్నారు.

.. ... ...

శ్రీ ఐరసింగరావుగారు మున్నగు కొందరు హిందూనాయకులను, మరికొందరు ముసల్మానుముఖ్యులను కలిసి విమానాలదాడులనుండి రక్షణను ఏర్పాటుచేయుట,పౌరరక్షణ అనువిషయములనుగూర్చిచెప్పిప్రకటనను మధురగా. నిజాంప్రభుత్వమువారు గమనించినట్లును, ఈవిధముగా హైదరాబాదులోని రెండుపెద్ద తెగలవారి ఐకమత్యమును దృఢపరచుటకై యీవార్తప్రకటితులను గమనించినందుకు ఈనాయకులను అభినందించుచున్నట్లును,ఆప్రకటనలో సంతకములను చేసినవారలను విమానాలదాడులనుండి రక్షణను, పౌరరక్షణను చేయబోవుఏర్పాటులలో చేర్చుకొనునట్లును,ఇదేవిధముగా జాతిమతప్రాముఖ్యముగల ఇతరవిషయములలోకూడ ఐకమత్యము ఉండగలదని ప్రభుత్వమువారాశించుచున్నట్లును ఒక ప్రభుత్వప్రకటన వర్వణ్ని ౨౭వతేదిన వెలువడినది.

... ... ...

## హైద్రాబాదుబజారుదరలు

౨౭-౨-౧౯౪౨ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లకూరమూడరబ్బీ ఫారికే.

| విషయము | పల్లా ౧కి ధర |
|---|---|
| | రూ అ పై |
| కిచిడిసాంబర్లు | ౨౪ నుండి ౨౯ వరకు |
| సంబర్లు | ౨౪ ౨౩౪ |
| ఢిల్లీబోగాలు | ౨౪ ౦ ౦ |
| రాంసాగర్లు | ౨౧౪-౨౨ |
| నానక్రాం | ౨౨ ౦ ౦ కొత్తవి |
| ,, | ౨౪ ౦ ౦ పాతవి |
| అరొక్కటి | ౨౨-౨౨౪ కొత్తవి |
| ,, | ౨౯ ౦ ౦ పాతవి |
| కోవామణి | ౨౧౪-౨౨ |
| బియములు | ౨౧ ౦ ౦, ౨౦౪ |
| తేకాటి | ౨౦, ౨౨వరకు |
| గోధుమలు | |
| షర్బతి | ౨౪ ౪ ౦ అన్నిరకములు |
| బక్సి | ౨౨-౨౦ వరకు |
| అవ్వారి | ౨౪ ౦ ౦ |
| పోటియా | ౧౯-౨౦ ౦ ౦ |
| ఎర్రగోధుమలు | ౨౦ ౨౧ |
| తెల్ల జొన్నలు | ౧౨ ౬౦ |
| పచ్చజొన్నలు | ౧౦౬౪ |
| సెనగలు | ౧౯ ౪ ౦ వరకు |
| కందులు దొరవి | ౧౨ ౯ ౧౪ |
| మినుములు | ౧౪ ౧౨ ౦ |
| ఉలవలు | ౧౩ ౧౦ ౦ |
| సజ్జలు | ౧౦-౧౦ ౪ ౦ |
| పప్పులు | |
| సెనగ పప్పు | ౨౧౪-౨౨ |
| కంది ,, | ౧౩-౯-౦ ౧౯ |
| పెసరపప్పు,, | ౨౧ ౨౨ ౯ ౦ ౨౩ |
| అలసం ,, | ౨౦ ౦ ౦ |
| మినప ,, | ౨౧ ౦ ౦ ౧౩౪ |
| పెసర ,, | ౨౦ ౦ ౦ |
| తెల్లమా ౧౪-౦-౦ నుండి ౧౯ | |
| ఉప్పు | ౧౨, ౧౨ ౯ ౦ |
| ఫుల్లిగడ్డ | ౬౪ నుండి ౯ వరకు |
| వరుస మంచిది | ౨౯ నుండి ౩౨ వరకు కొత్తవి |
| చక్కెర మణుగు [౪౦ సేర్లు] | |
| జావా | ,, ,, ౧౪ ౦ ౦ |
| బొంబాయి | ,, ,, ౧౩ ౧౪ ౦ |
| మద్రాసు | ,, ,, ౧౩ ౧౯ ౦ |
| నిజామాబాదు | ,, ,, ౧౩ ౧౨ ౦ |
| ఎర్రచక్కెర | ,, పల్లా ౨౦ ౦ ౦ |
| కర్ణచక్కెర | ,, ౪౦ సే. ౧౬ ౧౨ ౦ |
| ఎల్లిగడ్డ మణుగు ౧౨ సే. | ౬ ౦ ౦ |
| అల్లం | ,, ,, ౨ |
| మణుగు ౧౨ సే. | |
| కొత్వెరమూసె | ,, ౯ ౧ ౦ |
| వసుమమూసె | ,, ౯ ౦ ౦ |
| నువ్వులనూనె | ,, ౪ ౫౪ |
| వేరుసెనగనూనె | ,, ౪ ౦ ౦ |
| కిరోసిన్ (గ్యాస్, ,,డబ్బా ౧కి ౪-౧౨-౦ | |
| నెయ్యి మణుగు ౪౦ సేర్లు | |
| బిడి నెయ్యి | ,, ౬౯ ౦ ౦ |
| తెలంగానా | ,, ౪౯ ౦ ౦ |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ ౬ ౦ |
| ఉయహాలు బస్తా | ౯, ౧౧ ౦ ౦ |
| సెనగపిండి | ,, ౯ ౪ ౦ |
| పప్పు | ,, ౧౨ ౦ ౦ |
| బంగారు తులా ౧కి | ౬౧ ౦ ౦ |
| వెండి ౧౧౦ తు | ౯౪ ౯ ౦ |
| ,, తు ౧కి | ౦ ౧౪ ౦ |
| సవరన్ ౧కి పాలి రూ-౪౬. | ౯ ౦ |
| మారకం | |
| పాలికి కల్దార్లు | ౧౬ ౫ ౦ |
| కల్దారుకు పాలీలు | ౧౬ ౩ ౦ |

తక్కినవస్తువుల ధరలు ఇదివరలో సందేశముందు ప్రకటించినట్లే యున్నవి. మారలేదు.

### బొంబాయి ధరలు

(ఫిబ్రవరి ౧౬. వ తేదిన)

రూ. అ. పై.

(జనవరి ౧౬. వ తేదిన)

వెండి (తయారు) తులాలు౧౦౦కి ౯౫-౫-౦

,, (నవంబరు వాయిదా) తు.౧౦౦కి ౬౯-౫-౦

బంగారు (తయారు) తులం ౧కి ౫౦-౯-౦

,, (నవంబరు వా॥) ,, ,, ౪౯-౯-౦

గమనిక:-

ధరలు వీలైనంతవరకు సరిగ్గానుగా తెలుపుచుందుము- అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు.

---

నిజామాబాదుజిల్లాలో మలేరియానివారణకై మొత్తముగా రూ ౧౧౦౪౦అన్యక్రతువిటు రూ. ౫౪౦౦౬-౦అ ఖర్చుచేయుటకు శ్రీ శ్రీ ప్రభుత్వగారు అనుమతించినారు. ఇందుకు సంబంధించిన పని రాబోవు అక్టోబరునెలలో ప్రారంభమగుటకు ఏర్పాట్లు చేయబడినవి-

... ... ...

౧౯౪౧ ఇప్పందాదునెలలో హైదరాబాదు నగరములోను దానిచుట్టుపట్టు గ్రామాలలోను ప్లేగుతేమండెను- జిల్లాలలోమాత్రము ౪౧మంది ప్లేగుచే మరణించిరి —

